# జీవన స్పర్శ

సురేష్ వేగంగా కారు నడుపుతున్నాడు. వెనుకసీటులో పెద్దమామయ్య, అమ్మ కూర్చుని వున్నారు. ఇద్దరి ముఖాలు విచారంగా వున్నాయి. ఎవరి మధ్యా మాటల్లేవు. ఆకాశంలో అక్కడక్కడ విసిరేసినట్లుగా వున్న తెల్లని మబ్బులు నెమ్మదిగా ప్రయాణిస్తూ ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా వున్నాయి. అప్పుడప్పుడే వేడెక్కుతున్న గాలి లోపలికి దూసుకువస్తూవుంది. మామయ్య ఆలస్యంగా రావడంతో ప్రయాణం ఆలస్యమైంది. వూర్లో అందరూ ఎదురు చూస్తుంటారు. ఎంత తొందరగా పని ముగిస్తే అంత తొందరగా తిరిగి రావచ్చు.

సురేష్ ఆలోచనలన్నీ కర్నూల్లోని ఇంటి చుట్టూరానే వున్నాయి. పదిసెంట్ల స్థలం. ఐదు సెంట్లలో ఇళ్ళుకట్టి ముందంతా తోట పెంచుకున్నారు. ఒకప్పుడు వూరిబైటి ఆ ప్రదేశం ఇప్పుడు అత్యంత ఖరీదైన ప్రాంతంగా మారింది. ఇంటిపక్కనే మరో పది సెంట్ల స్థలం ఎవరిదో ఖాళీగా వుంది. ఒక బిల్డర్ కన్ను ఆ ప్రదేశంపై పడింది. ఖాళీస్థలం కొనుగోలు చేసి రమేష్ వాళ్ళమ్మకు బేరం పెట్టాడు. డబ్బుతో పాటు ఒక ఇల్లు కూడా ఇస్తానన్నాడు. కానీ ఆమె అమ్మడానికి ఒప్పుకోలేదు. దాంతో హైదరాబాదులో వుంటున్న సురేష్‌కి కళ్ళు తిరిగేలా మరికొంత మొత్తం ఆఫర్ చేస్తూ ఒత్తిడి పెంచాడు.

సురేష్ ఇళ్ళు అమ్ముదామని అమ్మని అడిగితే "రేయ్... కన్నా.... ఇది మీ నాన్న, నేను ఎంతో కష్టపడి కట్టుకున్న కలల ఇళ్ళురా.... తినీ

తినక పైసా పైసా దాచిపెట్టుకుని, బ్యాంకులో అప్పు తెచ్చుకుని, మాకు ఇష్టమైన రీతిలో కట్టుకున్నాం. దీనిచుట్టూ ఎన్ని జ్ఞాపకాలు అల్లుకొని వున్నాయో నీకర్థం గాదు. ఇందులోని అణువణువులో మీ నాన్నే కనిపిస్తాడు. నేను పోయాక నీ యిష్టం. కానీ నేనున్నంతవరకు దీనిని అమ్మమని మాత్రం అడుగొద్దు" అంటూ మొండికేసింది. ఎంత చెప్పినా విన్లేదు. అట్లా రెండు నెలలు గడిచిపోయాయి. ఎటువంటి ఆదాయాన్ని ఇవ్వక వ్యర్థంగా వున్న ఖాళీ స్థలం, పాడుబడిన ఇంటి గురించి అమ్మ అట్లా పట్టుబట్టడం అతనికేమాత్రం నచ్చలేదు. ఇప్పటికే చాలా నష్టపోయాననుకున్నాడు. ఈ సారి ఎట్లాగైనా సరే అమ్మను ఒప్పించాలని రెండురోజులు సెలవుపెట్టి హైదరాబాదునుండి వచ్చాడు. కానీ అనుకోనిది జరిగి ఇట్లా పాణ్యం బైలుదేరాల్సి వచ్చింది. సురేష్‌కి చాలా అసహనంగా వుంది. "ఛ... ఛ... ఇప్పుడే జరగాల్నా" అని అనేకసార్లు గొణుక్కున్నాడు. తిరిగి వెళ్ళాక గొడవపడయినా సరే అమ్మను ఒప్పించాలనుకుంటూ టైం చూసుకున్నాడు. పన్నెండవుతూ వుంది. రోడ్డుకి రెండువైపులా గమనించాడు. చిన్నచిన్న డాబాలు వెనక్కి పరుగెడుతున్నాయి.

"మామా... అక్కడికి వెళ్ళాక భోజనం అదీ కష్టం. ముందే తిని వెళదాం" అన్నాడు. అమ్మ ఏమీ మాట్లాడలేదు. మామ ఒక్క క్షణమాగి తలూపాడు. ఒక మంచి డాబా కనబడగానే సురేష్ కారు పక్కకు తీసుకెళ్ళి ఆపాడు.

సురేష్, పెద్దమామ కిందికి దిగారు. అమ్మ లోపలేవుంది. "నాకు ఆకలిగా లేదు. మీరు వెళ్ళండి" అంది. ముఖం అవతలివైపుకి తిప్పుకుని వుంది. ఆమె ముఖంలో ఏ భావాలూ తెలియడం లేదు. "అమ్మా.... అక్కడి పరిస్థితి ఎట్లుంటాదో, ఎంత సేపవుతాదో... కాస్త తింటే మేలుగదా" అన్నాడు. ఆమె ఏమీ మాట్లాడలేదు. "ఛ.... ఛ... వెధవ సెంటిమెంట్లు. కొంచం గూడా అర్థం చేసుకోరు" అని లోపల్లోపల గొణుక్కుంటూ డాబా

దగ్గరికి చేరాడు. డాబా కట్టి చాలాకాలం అయినట్లుగా వుంది. ఇటుకకీ ఇటుకకీ మధ్య సిమెంటు సరిగ్గా లేకపోవడంతో చాలా ఇటుకలు రాలి కింద పడుతున్నాయి. ఒక మేస్త్రీ గోడను మరలా సరిచేయడం కోసం వాటిన్నటిని కుప్పచేసి సిమెంటు కలుపుతున్నాడు డాబా ముందు కుర్చీలలో కూర్చున్నారు.

సర్వర్ వచ్చాడు. ఏమి కావాలన్నట్టు మామ వంక చూశాడు సురేష్. “ఏదో ఒకటి” అన్నాడు వినిపించీ వినిపించనట్లుగా. సురేష్ కాస్త ఆలోచించి దాల్, రోటీ, ఎగ్‌బుర్జు ఆర్డరిచ్చాడు. మామ ఏదో ఆలోచిస్తూ, కోడి గెలికినట్లు గెలుకుతూ, బలవంతంగా ఓ మూడు రోటీలు తిన్నాడు. సురేష్ కూల్‌డ్రింక్ తెప్పించుకొని తాగుతూ కడుపునిండా తిన్నాడు.

ప్రయాణం మళ్ళా మొదలైంది. సురేష్ హెడ్ ఫోన్స్ తీసుకొని తగిలించుకున్నాడు. చెవుల్లో శబ్దాలు రిథమిక్‌గా మోగుతున్నాయి. గంటకంతా పాణ్యం చేరుకున్నారు. చిన్నమామ ఇళ్ళు బస్టాండ్‌కు దగ్గరే. చాలాసార్లు వచ్చాడు. దాంతో నేరుగా ఆ సందులోకి తిప్పాడు. అప్పటికే అక్కడికి కొందరు చేరుకున్నారు. కారాపగానే అంతా వడివడిగా చుట్టూ మూగారు. చిన్నమామ కళ్ళలోంచి నీళ్ళు కారిపోతున్నాయి. సురేష్ కారుదిగి తాళం తీసుకొని డిక్కీ తెరిచాడు.

చిన్నమామ లోపలికి చూసి ఎక్కిళ్ళు పెడుతూ పెద్దగా ఏడ్వసాగాడు. అమ్మ, పెద్దమామ అతనితో గొంతు కలిపారు. కొందరు వచ్చి ఓదార్పుగా వాళ్ళను పట్టుకున్నారు. కారు డిక్కీలో ప్రశాంతంగా... ఈ లోకంతో సంబంధం లేనట్లుగా, మూసుకున్న కళ్ళతో, పచ్చని ముఖంతో సురేష్ వాళ్ళ అమ్మమ్మ హాయిగా నిదురపోతున్నట్లుగా వుంది. ఆమె ఎత్తు చాలా తక్కువ. దాంతో డిక్కీలో సరిగ్గా సరిపోయింది. వూరివాళ్ళు కొందరు వచ్చి డిక్కీలో వున్న అమ్మమ్మ శవాన్ని జాగ్రత్తగా కిందకి దించి ఇంటి ముందుకు చేర్చారు.

నిన్న రాత్రి వరకూ మామూలుగానే మాతో మాట్లాడుతూ నిద్రపోయింది. ఎప్పుడూ ఆరుకల్లా లేచేది. అట్లాంటిది ఏడయినా వులుకూ లేదు, పలుకూ లేదు. కుదిపిచూస్తే ఇంకేముంది నిద్రలో ఎప్పుడు ప్రాణం విడిచిందో ఏమో, సురేష్ వాళ్ళమ్మ కళ్ళు తుడుచుకుంటూ అక్కడివారికి చెబుతూ వుంది. అమ్మమ్మకు ఇద్దరు కూతుళ్ళు, ఇద్దరు కొడుకులు. తాతయ్య చనిపోయాక కొడుకుల దగ్గర చెరీ ఆర్నెళ్ళు వుంటూవుంది. చిన్న కూతుర్ని చూడక చాలా రోజులైందని నెలకింద వచ్చింది. రేపో, ఎల్లుండో తిరిగి కొడుకు దగ్గరికి వెళ్ళిపోదామని అనుకుంటున్న సమయంలో ఇట్లా జరిగింది.

సురెష్ నెమ్మదిగా చిన్నమామ దగ్గరికి వెళ్ళి "ఏర్పాట్లన్నీ అయినాయా" అనడిగాడు.

"అక్క విజయవాడ నుంచి రావాలి గదా.... ఎంత సేపవుతుందో... ఏమో.... అందుకే ఎవరికీ ఇంకా చెప్పలే" అన్నాడు.

సూర్యాస్తమయానికంతా సమాధి చేయడం పూర్తి కావాలి. లేకపోతే రాత్రంతా... ఇక్కడే... శవాన్ని చూస్తూ.... ఆ ఆలోచన నచ్చలేదు సురేష్‌కి.

పెద్దమ్మకు ఫోన్ చేశాడు. "ఇంకో మూడు గంటలు పడుతుంది" అని సమాధానం వచ్చింది. టైం చూసుకున్నాడు. ఐదు లేదా ఆరుకంతా ఖచ్చితంగా చేరుతుంది. ఎండాకాలం కాబట్టి ఏడుదాకా చీకటి పడదు. వచ్చేలోపు సిద్ధంచేసి వుంచితే రావడం రావడం చివరి చూపు చూపించి పాడెను పైకెత్తొచ్చు. శ్మశానం చాలా దగ్గరే. మైన్ రోడ్డు దాటితే చాలు. పావుగంటలో చేరుకోవచ్చు.

చిన్నమామ వంక చూశాడు. చాలా విచారంగా ఒకమూల కూర్చుని కళ్ళు తుడుచుకుంటున్నాడు. కొన్ని సమయాల్లో చిన్నవాళ్ళు పెద్దవాళ్ళు అని ఏమీ వుండదు. ఎవరో ఒకరు చొరవ తీసుకుంటే మిగతావాళ్ళు అనుసరిస్తారంతే. ఇది కూడా అట్లాంటి సందర్భమే. అందుకే చిన్నమామ దగ్గరికి వెళ్ళి "మామా.. పెద్దమ్మ వచ్చేలోగా అన్నీ సిద్ధం చేసేద్దాం. వూరోళ్ళకు

గూడా సాయంత్రమే సమాధి చేస్తున్నామని కబురంపించు. కారుంది గదా... నువ్వురా... దాసరోన్ని పట్టుకొద్దాం" అన్నాడు. చిన్నమామ మౌనంగా లేచి బైలు దేరాడు.

పూర్లో దాసరోన్ని కలిశారు. ఏమేం కావాలో లిష్టు రాసి "సార్... మీరివన్నీ తెచ్చేలోగా నేను మీ ఇంటిదగ్గరికి పోయి పాడె తయారు చేస్తాను. ముఖ్యంగా మొదట కట్టెలు శ్మశానానికి పంపమని చెప్పండి. నేను పోతా పోతా కాపరికి దించుకోమని చెప్పిపోతా. వాడు అన్నీ పద్ధతిగా అమర్చి వుంచుతాడు" అన్నాడు.

వాళ్ళు మొదట కట్టెల అంగడికి చేరుకున్నారు. బండిమీద కట్టెలు పంపియ్యమని చెప్పి సురేష్ డబ్బులియ్యబోతుంటే చిన్నమామ వద్దంటూ చేయి పట్టుకుని ఆపాడు.

"ఏం మామా.... ఎవరిస్తే ఏం" అన్నాడు సురేష్.

"తల్లికి చివరి ఖర్చుగూడా పెట్టుకోకుంటే ఎట్లరా.... నువ్వు ఎక్కడా జేబులో చేయి పెట్టొద్దు" అన్నాడు చిన్నమామ.

సురేష్‌కు నవ్వు వచ్చింది. ఆపుకున్నాడు.

వస్తువులన్నీ ఒకొక్కటీ తీసుకుంటూ, కనబడిన వాళ్ళందరికీ చెబుతూ, వాళ్ళని ఇంకొకరికి చెప్పమంటూ, కొందరికి ఫోన్లు చేస్తూ, ఇంటికి చేరుకున్నారు.

అప్పటికే చాలామంది చేరుకున్నారు.

ముసిలోళ్ళు కొందరు అమ్మమ్మనే చూస్తూ తదుపరి వంతు తమదేనేమో అని భయపడుతున్నారు. మరికొందరు ఇట్లాంటి సుఖమైన చావు తమకింకా రాలేదే అని కుమిలిపోతున్నారు. ఇంకోపక్క స్నానం, బట్టలు మార్చడంలాంటి పనులన్నీ అందరూ కలసి చేసేస్తున్నారు. మగవాళ్ళు దాసరి సలహాలతో పాడెను కడుతూ కుండలో పిడకలు వేసి నిప్పు రగిలిస్తూ వున్నారు. అంతిమ యాత్రకు అంతా సిద్ధం అయిపోతూ వుంది. పెద్దమ్మ రావడం ఒక్కటే మిగిలిపోయింది.

ఇంకా ఒక గంట సమయముంది. సురేష్ ఈ తతంగం ఎప్పుడెప్పుడు పూర్తవుతుందా, ఎప్పుడెప్పుడు కర్నూలు తిరిగి పోదామా అని ఎదురుచూస్తున్నాడు. ఆ ఏడుపులు చాలా విసుగ్గా వున్నాయి. ఊరివాళ్ళంతా ఒకరి తరువాత ఒకరు రాసాగారు. నెమ్మదిగా గుంపు పెరిపోతోంది. తమతోగల సంబంధం, అనుభవాలు, మంచితనం నిశబ్ధంగా విప్పుకుంటున్నారు. ఒకరకమైన గంభీరతతో కూడి ప్రశాంతత. ఎవరి ఆలోచనల్లో వాళ్ళు. ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ అప్పుడప్పుడు సన్నగా ఏడుపులు. సురేష్ తల విదిల్చి బజారులోకి పోయి టీ తాగి, కాసిని బిస్కట్లు తిని మళ్ళా వచ్చాడు.

బంధువులు చాలామంది వస్తున్నారు. పుట్టింది, చిన్నప్పుడు ఎండాకాలం సెలవులంతా గడిపింది అమ్మమ్మ ఇంట్లోనే అయినా పెద్దయ్యాక ఆ వూరికి రావడం తక్కువయింది కాబట్టి సంబంధాలు చాలా వరకు తగ్గిపోయాయి. చిన్నప్పుడు పరిచయమున్న స్నేహితులు, బంధువులు కళ్ళతోనే పలకరిస్తున్నారు. బాగా తెలిసిన వాళ్ళు భుజమ్మీద చేయేసి తడుతున్నారు. సురేష్‌కు వాళ్ళెవరితోనూ మాట్లాడ్డం ఇష్టంలేక గంభీరంగా కూర్చున్నాడు. దాంతో ఎవరూ పెద్దగా మాటలు కలపడంలేదు. అంతలో ఒక ముసలామె నెమ్మదిగా దగ్గరికి వచ్చి సురేష్‌ను పట్టి పట్టి చూస్తా "నువ్వు రాములమ్మ కొడుకువి గదా" అంది. సురేష్ అవునన్నట్లుగా తలూపాడు. ఆమె ఆనందంగా "నేను మీ అమ్మమ్మకు వరుసకు చెల్లెల్ని అవుతాన్లే. రెండిళ్ళ పక్కనే. చిన్నప్పుడు నువ్వు చాలాసార్లు మా ఇంటికి వచ్చేటోనివి. మా పశుల కొట్టంలో కోడెదూడలతో ఆడుకోడానికి, గుర్తుందా" అంది ఆప్యాయంగా.

సురేష్ పరిశీలనగా ఆమె వంకే చూశాడు. నెమ్మదిగా నడివయసులోని ఆమె రూపం కళ్ళముందు మెదిలింది. ఆమె అతని పక్కనే మంచానికి

అనుకుంటూ కింద జారగిలబడి కూర్చుని ఆప్యాయంగా అతని చేయి పట్టుకుంది. వదిలించుకోవాలనుకున్నా ఎందుకో వదిలించుకోలేక పోయాడు. ఆమె కన్నీళ్ళతో "పుణ్యాత్మురాలురా... మీ అమ్మమ్మ. ఎవరినీ బాధపెట్టకుండా, మంచాన చేరకుండా వెళ్ళిపోయింది. అందరికీ అట్లాంటి చావురాదు" అంది. ఆమె మనసులో ఏ జ్ఞాపకాలు కదలాడుతున్నాయో కళ్ళు మాటిమాటికి ఊటబావులవుతున్నాయి. వణుకుతున్న ముడతలు పడిన ఆమె చేతుల్లోంచి ఏదో తెలియని భావం సురేష్ శరీరంలోనికి ప్రవహిస్తూవుంది.

"నువ్వంటే ఎంతిష్టమో తెలుసా మీ అమ్మమ్మకి... చిన్నప్పుడే నాన్నను కోల్పోయావని" అంది గుర్తుచేసుకుంటూ. సురేష్‌కి ఒళ్ళు జలదరించింది. "ఒకసారి నీకు జ్వరమొచ్చింది. పది రోజులు దాటినా వదల్లా. తిండి తినక ఎముకలగూడులెక్క అయి పోయినావు. పెద్ద డాక్టరుకి చూపిస్తే టైఫాయిడని తేలింది. అది మంచి పంటలకాలం. విషయం తెలిసి మీ అమ్మమ్మ గబగబా బట్టలు సర్దుకోని మీ వూరికి బైలుదేరింది. ఇట్లాంటి సమయంలో పోతే ఎట్లానే అని మీ తాత నెత్తీనోరూ కొట్టుకుంటుంటే పంట ముఖ్యమా... పిల్లోడు ముఖ్యమా.... పాపం. ఆడ చిన్నదొక్కతే ఒకపక్క ఉద్యోగం చేసుకుంటూ, మరోపక్క పిల్లోన్ని చూసుకుంటూ ఎన్ని అవస్థలు పడుతుందో ఏమో అని పరుగెత్తుకొని వచ్చింది" అంటూ ఆగింది.

అంతలో ఆమె ముఖంలో తళుక్కున చిరునవ్వు మెరిసింది. "రేయ్.... నీకు తెలుసో లేదో... మీ అమ్మమ్మది చాలా ఒత్తయిన నల్లని రింగుల రింగుల జుట్టురా.... నాగుపాములా చాలా పొడవుగా వుండేది. చూస్తే ఎవరూ కళ్ళు తిప్పుకోలేరు. అదంటే ఎంతిష్టమో తెలుసా దానికి. ఎప్పుడూ బాగా నూనె రాసి, శుభ్రంగా దువ్వుకుంటూ, తలనిండా పూలు తురుముకుంటూ అద్దంలో చూసుకొని, చూసుకొని మురిసిపోయేది. ఒక్క

వెంట్రుక రాలినా గిలగిలలాడిపోయేది. అట్లాంటిది నీకు బాగు కాగానే మీ వూరి నుంచి సక్కగా శ్రీశైలానికి పోయి ఆ బంగారంలాంటి జుట్టునంతా దేవునికి ఇచ్చేసి తళతళలాడే గుండుతో వూర్లో దిగింది. అది చూసి మీ తాత మొదలు కన్నబన్నవాళ్ళంతా తిట్టినతిట్టు తిట్టకుండా తిట్టినారు. ఐనా మీ అమ్మమ్మ మెరుస్తున్న కళ్ళతో నా మనవని ప్రాణాలకన్నా ఈ జుట్టెక్కువనా... వాడు అట్లాగే సల్లగావుంటే ఒకసారి గాదు వందసార్లయినా కొట్టించుకుంటా నున్నగా అంది నోరారా నవ్వుతా" అనింది.

అమ్మమ్మ తలవెనుక అంటించిన అగరబత్తుల వాసన నెమ్మదిగా ఒక్కొక్కరినే తాకుతూ ఆ ప్రదేశమంతా నిండిపోతావుంది. సురేష్ ఎంత వద్దనుకుంటున్నా జ్వరం వచ్చిన ఆ చిన్ననాటి రోజులు కళ్ళముందు కదలాడసాగాయి. నెమ్మదిగా జ్ఞాపకాల గట్లు తెగి చినుకులై, జడివానై, వరదై ముంచెత్తసాగాయి. మనసంతా అమ్మమ్మ పరిమళాలతో నిండిపోరీగింది. ఏదో తెలియని వేదన. కళ్ళలోంచి నీటి చుక్క జారి భూమాతను పలకరించింది. చిన్ననాటి ఆనందపు జ్ఞాపకాల దొంతరలు విషాదాన్ని పెంచుతున్నాయి. మనసంతా స్పర్శ కోల్పోయిన అనుభూతి. నెమ్మదిగా లేచి బస్టాండ్ వైపు భారంగా అడుగులేశాడు. అంతవరకూ అపరిచతంగా కనబడిన వూరు బ్లాక్ అండ్ వైట్ చిత్రంగదా నెమ్మదిగా రంగులు సంతరించుకొని జీవం పోసుకున్నట్లుగా చాలా సుపరిచితంగా కనబడుతోంది.

ఊర్లో తిరిగిన జట్కా ప్రయాణాలు, దారికిరువైపులా అందమైన నర్సరీలు, వూరి ముందరి చెరువు, గోడమీద వేలాడుతున్న ఫోటోలు, గూటిలోని పెద్ద రేడియో, అమ్మమ్మ తాతయ్యల ఆప్యాయపు పలకరింపులు, స్నేహితులతో కలసి తిరిగి ముచ్చట్లు.... ఒకదాన్తో ఒకటి కలసిపోతూ గుర్తుకు రాసాగాయి.

అంతలో అనుకోకుండా నాన్న గుర్తుకువచ్చాడు. ఇళ్ళు అమ్మమని గొడవ పన్నప్పుడు అమ్మ మాటలు గుర్తుకు వచ్చాయి. కొత్తగా కట్టించిన ఇంటిముందు అమ్మ చెల్లెలిని ఎత్తుకుంటే నాన్న తనను ఎత్తుకుని అమ్మ భుజం చుట్టూ చేయివేసి గర్వంగా చూస్తూ దిగిన ఫోటో గుర్తుకువచ్చింది. సురేష్‌కు నిలబడే శక్తి సన్నగిల్లి పోతోంది. తిరిగివచ్చి చివరన ఒక కుర్చీలో కూర్చున్నాడు.

అంతలో ఒక్కసారిగా ఏడుపులు మిన్నుముట్టాయి. చూస్తే పెద్దమ్మ. అప్పుడే వచ్చినట్టుంది. అంతవరకు ఆపుకున్న దుఃఖపు గట్లు మరలా ఒక్కసారి బ్రద్దలైనాయి. పెద్దమ్మకు తల్లి ముఖం చూపించి పాడె పైకి లేపారు. సురేష్‌లో ఏదో అపరాధ భావన పెరిగిపోతోంది. కళ్ళు మాటిమాటికీ చెమ్మగిల్లుతున్నాయి. పైకి లేవబోయాడు. కడుపులో ఎక్కడో గెలికినట్లనిపించింది. ఒక్కసారిగా సునామీలా తన్నుకొని వచ్చింది. పరుగెత్తుకుంటూ ఒక మూలకు పోయాడు. పొద్దున్నుంచీ తిన్నదంతా బైటకు వచేస్తోంది.

అంతలో రెండు చల్లని చేతులు అతని చెవులను మూసి పట్టుకున్నాయి. చూస్తే చిన్న అమ్మమ్మ.

ఆమెచల్లని చేతుల్లోంచి ఏదో తెలియని శక్తి సురేష్ శరీరంలోకి ప్రవహిస్తూ ప్రపంచాన్ని పట్టి నడిపిస్తున్న ఒక విశ్వ మానవ ప్రేమ రహస్యాన్ని అవగాహన చేయిస్తూ వుంది.

కాసేపటికి తేరుకున్నాడు. చూస్తే అప్పటికే వూరేగింపు సందు మలుపు తిరుగుతూ వుంది. పరుగెత్తుకుంటూ పోయి పాడె ఒక కొనను తన భుజమ్మీదకు అందుకున్నాడు.



